దిదైవమాచార్యుడది భూతమిష్టలింగార్పిత స్పర్శమధ్యాత్మనేత్ర - మదిదైవమాచార్యుడది భూతమిష్టలింగాత్మ స్వరూపమధ్యాత్మదేహ - మదిదైవమాచార్యుడది భూతమిష్టలింగార్పితరుచ్యమధ్యాత్మదేహ - మదియఘ్రాణమధ్యాత్మనిర్మాల్యగంధ- మట్లనదిభూతమదిదైవమాగురుండు- యగుప్రసాదాది బుద్ధీంద్రియాత్మవిషయ - భరిత సుఖమల్పులకు నైద్ది బసవలింగ. ౨౦౯

అదిదైవమాచార్యుడది భూతమిష్ట లింగార్పిత కవితమధ్యాత్మవాకు--అది దైవమాచార్యుడది భూతమిష్ట లింగార్పితదాన మధ్యాత్మపాణి - అదిదైవమాచార్యుడది భూతమిష్టలింగార్పితాలాపమధ్యాత్మపాద - మదిదైవమాచార్యుడదిభూతమిష్ట లింగార్పితసహిత మధ్యాత్మపాయు - యదియనుయవస్థయిష్టలింగార్పితంబు। మరియనుత్సర్జన క్రియల్ దొరలుచుండ - వరగకర్మేంద్రియాఫలగురుప్రసాద - భరితసుఖమల్పులకు నైద్ది బసవలింగ. ౨౧౦

వినియెడు శోత్రిముల్ వినుటయు వినబడుశబ్దజాలంబు చచ్ఛ్రవణసుఖము - పొందెడు త్వక్కును బొందుటయును బొందుస్పర్శంబులును తదానంగసుఖము - కనియెడు నేత్రముల్ గాన్పించుగాంచురూపములు సద్వీక్షణా స్పదసుఖంబు - అనియెడుజిహ్వయు వానుటయును నానురసము తదీయాచరణసుఖంబు - మూర్కొనందగుఘ్రాణంబు మూరుకొనుట ! మూరుకొను గంధమునసుతత్ప్రముదితసుఖము । నర్పితము జేసిబొందు మహాప్రసాది - నైనగుసుఖమల్పులకు నైద్ది బసవలింగ. ౨౧౧

షట్ప్రలాంతైకవింశత్సహస్ర స్వరార్పణము ప్రాణక్రియార్పణమువలన - శ్వాసనిశ్వాసాంగ పోషణార్పణ మపానవ్యాన మరుదర్పణంబువలన - దనుజేష్టశాలు వర్ధన ముఖార్పణముదానసమానపవ నార్పణంబువలన - నిష్ఠీవనోన్మేషనిమిషార్పణంబులు నాగకూర్మసమర్పణంబువలన - క్షుత్పిపాసాదిపరిశిష్టగుణసమర్ప - ణముకృకరదేవదత్త ధనంజయార్ప - ణములనగుదశప్రాణార్పణములనతని - కెసగులింగార్పణమునన బసవలింగ. ౨౧౨

అజనశిరోజశల్య స్నాయుముఖకఠిణార్పణబుద్ధి సమర్పణమున - లాలాసురుధిరశుక్లమూత్ర మజ్జామూ ఖార్పణమునసుసమర్పణమున - క్షుత్పిపాసాఖ్యసుషుప్తి సంయోగముఖార్పణ తేజస్సమర్పణమున - నానాసుయోగమనాగ

మననిరోధార్పణవాయు సమర్పణమున - గామముఖ్యమోహంతనరిగతిభయాన - మర్పణమునాకాశసమర్పణమున - అట్టిభూతార్పణంబు నాత్మార్పణమున - నెనగు మీప్రసాదంబయి బసవలింగ. ౨౧౩

తలపించు మనసును దలచుటయు దలంచు దలపులు మరిసముద్గతసుఖంబు । పలికించువాక్కును బలుకుటయును బల్కువలుకులు తత్సముద్భవసుఖంబు । జరియించుకాయంబు జరియించుటన్నేత చరియించదగు సముచ్చయసుఖంబు । జేయుకర్మంబులు జేయుటయును జేయునగుచెయ్యువలునుదన్నితాంతసుఖము । చెలగిచెల్లించు నాత్మయుచేతనమును । చేతనాధిష్టిత క్రియాతీతసుఖము । నర్పితము జేసిబొందునుదన్యత్ప్రసాది । నెనగసుఖమల్పులకు నెట్లు బసవలింగ. ౨౧౪

మున్నుబల్కిన వలుకుచున్న పలుకగగోరుచున్న వక్తవ్య సముదితసుఖము । మున్నుముట్టిన ముట్టుచున్న ముట్టగగోరుచున్న స్పర్శవ్యసముదితసుఖము । మున్నుచనిన చనుచున్నచనగగోరుచున్న గర్తవ్యసముదితసుఖము । మున్నునల్పిన నల్పుచున్న నల్పగగోరుచున్న గర్తవ్య సంయోగసుఖము । మున్నుయెరిగిన నెరుంగుచున్న నెరుగ । గోరుచున్న సుబోధ్య విచారసుఖము । వ్రిబలునంతవ్యసుఖసమర్పణము జేసి । యెనగుజెందు ప్రసాదియు బసవలింగ. ౨౧౫

అచలేంద్రియము శ్రోత్రమువిషయముచంద మదియుదానికి నింద్రియార్పణంబు । నచలేంద్రియము నేత్రమువలన విషయంబులవియింద్రియద్వితీయార్పణంబు । నచలేంద్రియమ్ముత్వక్కుచరించు విషయమునదియింద్రియతృతీయార్పణంబు । నచలేంద్రియము ఘ్రాణమవిషయంబును యదియింద్రియ చతుర్థయార్పణంబు । రసనచలేంద్రియంబు చరంబువిషయ । మదియనటు గూడవంచేంద్రియార్పణంబు । జెందుకొలికియు దానిచ్చుజెందుకొలికి । నెనగునెరుగ ప్రసాదియా బసవలింగ. ౨౧౬

అచలేంద్రియము వాక్కువచనము దగవరంబదియునింద్రియత్వదీయార్పణంబు । నచలేంద్రియము పాణియచలంబు తత్రిక్రియలవియింద్రియత్వదీయార్పణంబు । నచలేంద్రియముము పాదమచరంబు దత్క్రియలవియంద్రియద్వితీయార్పణంబు । నచలేంద్రమునుగువ్యమచరమయ్యాన ందమా ఇంద్రియద్వితీయార్పణంబు । మనసునచలేంద్రియంబునంస్మరణమచర । మదియునటుగూడవంచేంద్రియార్పణంబు । జెందుసుఖమును దానిచ్చిబొందుసుఖము । నెనగువాడె ప్రసాదియు బసవలింగ.

సర్వాంగములు లింగసన్నిహితంబుగ లింగంబునయ్యంగ సంగతముగ । ప్రాణంబులింగానుబంధంబుగాగ నాలింగంబు ప్రాణానుసంగతంబు । లీలనింద్రియములు లీలసంగంబుగా లింగంబునింద్రియసంగతంబు । సన్మనంబునులింగసన్నిహితంబుగా లింగంబుదన్మనః సంగతముగ । నట్లనన్యోన్యసౌహృదాహ్లాద భరిత । సమరసానంద సత్సుఖసహితహితన । మాహితాన్యోన్యగర్భ విహారణకేళి । నెనగువాడె ప్రసాదియ బసవలింగ. ౨౧౮

నీనేత్రలింగసన్నిహితమై నేత్రంబులర్పించు రూపలశాంతములను నీశ్రోత్రలింగసన్నిహితమై శ్రోత్రంబులర్పించుశబ్దలతాంతములను। నీఘ్రాణలింగసన్నిహితమైఘ్రాణంబులర్పించు గంధలతాంతములను। నీయంగలింగసన్నిహితమై త్వక్కుదానర్పించు స్పర్శలతాంతములను । నీదుజిహ్వయులింగసన్నిహితమగుచు । భజనసేయుచు సత్పూజపత్రపుష్ప। మట్లదాల్చును నిర్మాల్యమాత్రప్రసాది । భక్తినయనేంద్రియంబుల బసవలింగ. ౨౧౯

ముఖ్యరూపార్పణోన్ముఖమగు లింగసన్నిహితనేత్రంబులునిన్నెజూచ్చి । ముఖ్య గంధార్పణోన్ముఖమగు లింగ సన్నిహిత నాసికమును నిన్నుజూచ్చి। ముఖ్యశబ్దార్పణోన్ముఖమగులింగ సన్నిహితకర్ణంబులనిన్నుజూచ్చి । ముఖ్యరసార్ప ణోన్ముఖమగులింగసన్నిహిత రసజ్ఞయునిన్నుజూచ్చి । ముఖ్యసంస్పర్శనార్పణోన్ముఖతలింగ । సన్నిహితమాశరీరంబు నిన్నుజూచ్చి । యర్పితముజేసి బొందుసుఖానుభూతి । నెనగువాడె ప్రసాదియు బసవలింగ. ౨౨౦

ముఖ్యవాక్యార్పణోన్ముఖమగులింగసన్నిహితవాగ్వృత్తియునిన్నుజూచ్చి । వ్యక్తసన్మదనార్పణోద్యుక్తి లింగసన్నిహిత మానసములు నిన్నెజూచ్చి । ముఖ్యక్రియార్పణోన్ముఖమగు లింగసన్నిహితపాణిస్థితి నిన్నుజూచ్చి। ముఖ్యయాత్రార్పణోన్ముఖమగులింగసన్నిహితసత్కర్మ లనిన్నుజూచ్చి । వ్యక్తసన్మద నార్పణోద్యుక్త లింగ । సన్నిహితమానసంబులనిన్ను జూచ్చె । యర్పితముజేసి బొందుసుఖానుభూతి నెనగువాడెప్రసాదియు బసవలింగ. ౨౨౧

వసువర్ధన,నిమిత్తవాగ్దమనోద్ధతాలాపతుల్యాంభండంబులంటెనేని । ఖనత్కటోత్కటరసోపేత పాకంబు పచనవహ్ని యాహుతిగొనియె నేని।ధరవరదేవతాపర లింగబాహ్య వ్రతభ్రష్టులును మరిదాకెనేని । మశక పిపీలికా మక్షికాముఖ

జంతుచీసురాద్య పహతుల్ జెందెనేని। రంధ్రపోగండ భాండవిరచితమేని । యవిని షిద్ధపాకాన్నముల్ భవనమర్ప। ణార్పణముగావు ఖాడనసర్వమగుసు । భవము గాదెదలంపగబసవలింగ. ౨౨

ద్రవ్య శ్రీవణ సంస్మరణ దర్శన స్పర్శ నాదిరుచ్యంత రూపార్పణంబు। పిండితముద్గల పృథుకబశాభ్యంతరాన్వితభక్ష్యభోజ్యార్పణంబు। శాఖరసద్రవ్యషడ్రస సూపోదనాన్యో న్యపరిమిశ్రితార్పణంబు । తత్పదార్థాన్వితతత్ఫలావృత సుల తాఖినియుక్తి నమర్పణంబు । భక్ష్యభోజ్య లేహ్యపానీయ చోష్యము । ఖా సుభవ కలానమర్పణంబు । గాలికి యెరుగకున్నగూడునై లింగాను భవగుణాఢ్యుడగునై బసవలింగ ౨౩

మశకభృంగ పతంగమక్షికస్పర్శమార్జాలమూషికముఖాసక్తవృష్టి । వీర వ్రతాచార విరహిత ప్రాజ్యాది ధర్మాన్వితా ద్వైకకర్మదృష్టి । ప్రక్తిభోజన యుక్తపరిజన స్వకుటుంబి భార్యా ప్రసాదాన్నపానదృష్టి । వాక్క్రియామానస వ్యాప్తవిజ్ఞాపనాసావధానేతరసత్వదృష్టి।చేతసుపహతంబు జెందుసుతమరియన్య । మిశ్రితంబుగాని మీదుపూని । శుభతరపవిసావసునిధానిగాక గో । వ్యప్రసాదియగునై బసవలింగ. ౨౪

పాకశాసనలోన బసునారితిపులు ఖండితస్వరములు గదియనీక । దవివ్యా కృతులు దగదల్చిలోజాలకునడ పాటురూపులు సుడియనీక । నానాన్నపానపు నస్పర్శన భ్రాంతి పొందిడి చేముట్టిబొనగనీక। దర్వీచికబళింపదసుజొచ్చి కడువడి బోపునోరూరుల బొరలనీక। మనసునింద్రియ వ్వత్తి చే మరగనీక। చిత్తమింద్రియముల జెంత జేరనీక। నీకుయర్పించు భోగించునియతిలేక।నెనగునెబ్రిసాదసౌఖ్యంబు బసవలింగ. ౨౫

ద్రవ్యముల్ బంధించుచేతరిమరి వానివైనత్తిగా వింధక విత్తనూరు । నమలక బెదవులునాకక యుమియక చప్పరించక లాలదప్పిగొనక । జిరుదగ్గుదగ్గక జిహ్వాసారింపక బెదవులు దడవక యాదరనీక । గ్రుక్కిళ్లుమ్రింగక బిక్కబిల్వక యాత్మజీవసంయోగము జెడగనీక । బరగనపీంచు సంభ్రమపడకదుడుకు పడచుబరికించకనునిజాపాదిగుణము। లెద్దిజూపక వర్తించు బుద్ధివంతు । నెనగును ప్రసాదసౌఖ్యంబు బసవలింగ. ౨౬

శుద్ధాన్నపానముల్ శోధించిశోధించి స్వామికిపడ్డించుచట్టువంబు। భవ్యమై విలసిల్లు భస్మసంస్పర్శ గాత్రపాణేశునకు నిడువళ్లెరంబు। కర్తకు తత్రుచుల్ కడిజేసిగడిజేసి గుడుపుతన్మానసాంగుళి పుటంబు। నాదునాలుక నాలక—నాదునాలుక నాలక—నాలక— నాగలనాలక— నాజరించి। బొనగతత్రుచులెల్లను బొందవరచి। నంతనమునిన్నమనము ననంస్మరించి। అసమబుద్ధిని యిష్టలింగార్పణాది। వనతి గనిన ప్రసాదియె బసవలింగ. ౧౨౭

లింగసాన్నిధ్యంబు లింగాకితంబేని స్వామిభృత్యత్వంబుచర్యయేని। సతతపుణ్యోక్తిసముచితక్రియయేని యింద్రియస్వర్శంబు యిష్టమేని। అవధానసువిధానమభ్యాస్య మంబేనివిషయ స్వతంత్రంబు విషయమేని। కలితప్రసాద భోగానుశ్రితంబేని నినుజూచ్చియనికియమస్కియేని। నట్టిపూజకునకు మహాదిట్టమైన। ఫలముగల్గును దళ్ళకనలలితముగ। గాధజెందక దాభవాంబోధివిషచి। వరమసుకృతంబుజెందడె బసవలింగ. ౧౨౮

ఇవ్వడేశబ్దంబు లిచ్చినీకది నీవదెచ్చి శ్రోత్రములచే యిచ్చియిచ్చి। యివ్వడేస్పర్శంబు లిచ్చినీకది నీవదెచ్చి దేహంబుచేనిచ్చి యిచ్చి। యివ్వడేరుచ్యంబులిచ్చినీకది నీవదెచ్చి రసజ్ఞతనిచ్చియిచ్చి। యివ్వడేవాసనలిచ్చినీకదినీవదెచ్చి ఘ్రాణంబుచే యిచ్చియిచ్చి। యివ్వడెవ్వియుదలవగనిచ్చియట్టి। యడసుమది తృష్ణగానకను గడన జెడక। నెంతయును నర్పణముజేసి యింపుమీర। నెనగను ప్రసాదఫలమానె బసవలింగ. ౧౨౯

జూపక జూడక జూపకజూచినకనులవందువగనుకలకలేక। వినుపింపకవినకవినుపింప వినినుడీనులకునుమరివెరవులేక। అంటింపకంటక నాడింపకుండిన చేతులదండిగా ఖీతిలేక। నానింపకానక నానింపకానిన జిహ్వకు థట్టమైచింతలేక। నీకమూరుకొనక నీకమూర్కొనిన ఘ్రాణంబువందుపుగభయంబులేక। సన్నివిషయములను వన్నగాదెలిసిన। వాడుబోప్రసాది బసవలింగ. ౧౩౦

ఆరాధ్యదేవున కర్ఘ్యార్పణము జేసి కరమర్థిలింగజంగమముబడసి। నలిదేశికునకు ప్రాణసమర్పణంబాది గావించిప్రాణలింగంబుబడసి। మొదలశ్రీగురులింగమునకుశరీరార్పణము జేసి గద్దుప్రసాదమును బడసి। ఆచార్యవిభునకు నాత్మార్పణముజేసి భవ్యజీవన్ముక్తిబడసియట్ల। చనకప్రాణంబుయర్థంబుదన శరీర।

మనసిజాత్మయువంచింప మొదలజుట్టి। మగుడగాక తత్తనూలాభమాన సునకు।
పొనగసుప్రసాద సుఖమబ్బు బసవలింగ. ౨౩౧

శ్రీగురుమూర్తి కర్పించిన తనువ నర్పితభోగమునకు నైబెట్టడేని। ఆరాధ్య
దేవున కర్పితంబైన ప్రాణంబు నర్పితవిధి నడచెనేని। ఆరాధ్యదేవునకర్పితంబైన
మానసమర్పితంబుగా నెసగెనేని। తద్దేశికేంద్రార్పితంబైన సర్వార్థములునర్పి
తంబుగా బొలసెనేని। అరసిజూడనీవును మరియాప్రసాది। యనుప్రసాదోక్తిభ
క్తుల మనుచు మరియు। వెలగి యర్పింపభోగింప నిగ్గుగాదె। భక్తవత్సల సద
యాత్మబసవలింగ. ౨౩౨

ఆత్మస్వతంత్రలింగా నర్పితంబును కాలాహికాహుతి గాకయుండ। నం
గమయ్యంగ లింగానర్పితంబును దండపాదోద్వలత్తి దాకకుండ। ప్రాణంబుప్రాణ
లింగానర్పితంబైన మానసార్పితముగ మగ్నమగుచు। దంభోళిహతిచేత దలగక
యుండశైలంబు భాతినినిబ్బరంబుగాగ। నయ్యభవదీయగర్భాబ్ధిశయ్యనునిచి।
సావధానార్పణంబులనవధరించి। నితరభవ్య ప్రసాదంబు నియతియనిన। బ్రతుకు
గలదె ప్రసాదికి బసవలింగ. ౨౩౩

దేశిక సాంగోపదేశ మంత్రంబు ప్రసాదముశబ్దమాశ్రయముగాగ। నారా
ధ్యదేవు శ్రీహస్త మస్తకయోగమవి ప్రసాద స్పర్శమాదిగాగ। నాచార్యవిభుని
కృపావలోకనకు ప్రసాదావలోక నాస్పదముగాగ। సద్గురులింగ ప్రసాదాను
భూతికిఘనతరంబైనట్టి జననిగాగ। నాప్రసాదికి నాదిగానట్లుచనక। గురుచరే
శ్వరసాదసంస్మరణగాక। నితరమయినట్టివేరెసద్గతులుమరియు।బ్రతుకుగలదె ప్ర
సాదికిబసవలింగ. ౨౩౪

స్వామినీనేత్రప్రసాదదీప ప్రభాసంగతి నేత్రపతంగమణచు। స్వామినీశ్రో
త్రప్రసాదసుషిరనాదసంగతిశ్రోత్రభుజంగమణచు। స్వామినీనాసాప్రసాద చం
పకగంధ సంగతి నాసికాభృంగమడగు। స్వామినీకాయ ప్రసాదయోగ స్పర్శ
సంగతి కాయమతంగమడగు। పరమపావనమీప్రసాదరసభుక్తి। నాప్రసాదజిహ్వామ
త్స్యంబడంచు। గాననితరదుర్విషయాక్రాంత మణచు। భక్తి విషయేంద్రియంబులు
బసవలింగ. ౨౩౫

ననుగానవిననికర్ణములు గదాయనిశ్రోత్రప్రసాదంబుజొనపకున్న। నను
గానిబొందనితనువు గదాయనికాయప్రసాదంబు గ్రిమ్మరుకున్న। ననుగానజూడని

కనులుగదా యని నేత్రప్రసాదంబు నెరుగకున్న । ననుగానరుచిగను నాల్కగదాయనిజిహ్వప్రసాదంబుజేర్పకున్న।గంధమన్యథాయనగనీఘ్రాణమిదియ । యనుచుఘ్రాణప్రసాదంబునిసుపకున్న। నీవునావాడు వీడని బోధింపకున్న । బ్రతుకుగలదె ప్రసాదికి బసవలింగ. ౨౩౬

నీకువాహనములై నీలోన జరియించు మచ్చికనరులు సమర్పణముగ । నీకు పాదములునై నీలోననడుచునయ్యడుగుల కడుగు ల్సమర్పణముగ । నీకుపర్యంకమై నీలోనశయనించు నూర్పుకూర్పులును సమర్పణముగ । నీకుగద్దియయయినీలోననూర్చుండు మాటకుమాటసమర్పణముగ। పంచభోజనాకృతి నుండిపంచవిషయమానితసుఖార్పణముగ నీలోనమరియు । ననఘుచిత్తప్రసాదదేహస్థుడొందు । యనమసుఖములుదలచునే బసవలింగ. ౨౩౭

లింగపీఠంబగు నంగంబుప్రాణేంద్రియము మజ్జనము జేసియలవరింప। గంధపుష్పాదులు ఘ్రాణేంద్రియంబద్ది యొక్కించిధూపంబు లిచ్చువరుస। నేత్రేంద్రియంబదినీరాజనము దగ రసనేంద్రియం బొగిరసములిచ్చు । వాగేంద్రియమునిన్ను వర్ణించుశోత్రేంద్రియమువినుపించు గుణాంకనములు। నట్లయిష్టలింగార్చనంబాచరించుజనుతదీయప్రసాదాత్మసౌఖ్యమొందు। నవిరతేంద్రియ స్వాధీనుడగుప్రసాది । భక్తియతేంద్రియంబుల బసవలింగ. ౨౩౮

లోపంబులేక విజ్ఞాపింపకున్న తద్విజ్ఞానమును నీవు వినకనున్న । నంటినరూపంబు లర్పింపకున్న నీవటుల నేత్రేంద్రియమంటకున్న । నానకరుచులవధానిమైయిూకున్న పూనితద్విషయాదులానకున్న । నవియును నినుబోల్చియనుభవింపకనున్న నీవుయిట్టుల గరుణింపకున్న। నాప్రసాదియు నీవనాకనకనున్న । నేనునీకని నీవునుబూనకున్న । నమముగాకనుయిరువదోషంబుకలిమి । బలిమినర్పించునైకాన బసవలింగ. ౨౩౯

వినగనేరదు నీవువినుపింపక ప్రసాది వినుపింపకయు నీవువినవతండు । ముట్టనేరదు నీవుముట్టింపక ప్రసాదిముట్టించకయు నీవుముట్టవతడు । చూడనేరదునీవుజూపకయె ప్రసాది జూపకనీవును జూడడతడు । నాననేరందునీవానింపకప్రసాదియానింపకయు నీవనానవతడు । దాపిగొనరట్ల నీవునతండుగాన । ప్రీతులనిరువురనన్యోన్యవర్తనముల । జందమెరుగక నిరువుర బొందుబడక । నెనగుపాదసుఖంబులు బసవలింగ. ౨౪౦

వినువింపకనుదాను వినగరాదెల్పియు వినక వినుపింపక వినకరాక । జూచిజూపకయున్న జూడగాదెల్పియు జూడగజూచియు జూడదగదు । ముట్టిముట్టింపక ముట్టరాదెల్పియు ముట్టకముట్టింపముట్టగాదు। మూర్కొనియూకున్న మూర్కొనగాదు మూర్కొనక నిచ్చినను మూర్కొనగరాదు । యారగించియూకుండిన నారగింప । కిచ్చినగొనంగరాదు తంచేంద్రియాదు । లైనవిషయముల్ చేకొని యవధరింప । కెనగగ ప్రసాది ధర్మంబు బసవలింగ. ౨౪౧

జూడకర్పించిన చూటుకలు దనియవు జూచియర్పించిన జూడవీవు । ముట్టకర్పించిన మును జెందనియ్యవు ముట్టియర్పించినముట్టవట్లు । వినకనర్పించినవీనులదని యవువిని సమర్పణసేయ వినవునీవు । నానకపిణంచిననట జిహ్వదనియవు యానియర్పించిన నానవట్లు । ఘ్రాణమునసమర్పించువేటక యుడునమున । నింద్రియముల నమ్మగజాలనెట్టులనక। పొందకయు పొందిపొందించుబొందుస్వాను ।భవసుఖంబల్పులకు నెద్ది బసవలింగ. ౨౪౨

తన నేత్రములు దనమనసునమనసును నేత్రంబులందు నిర్ణీతమయ్యె । దనశోత్రములు దనమనసు శ్రోత్రములు నీశ్రోత్రంబులుండ విశ్రుతములయ్యె। దనఘ్రాణమునుదన మనసు ఘ్రాణమును నీఘ్రాణంబునందు సంక్రమణమయ్యె । దనజిహ్వయును దనమనసుజిహ్వయును నంగము భవిజిహ్వంగ కలితమయ్యె । గానతత్స మర్పణమానుగాక । ననకనినుజూచ్చియును సోహమనకనలరు । నవ్యయాతీతుడైన దివ్యప్రసాది। కెనగు సుఖ మల్పులకు నెద్దిబసవలింగ. ౨౪౩

నీకుయర్పించియునినుముట్టదనుముట్టముట్టింపముట్టింపముట్టునవియు । నీకునర్పించియునినుజూచుదనుజూచుచూపంగజూచునీజూచునవియు ।నీకునర్పించియునినువినుదనువిను వినుపింపవినవీవు విన్నవనియు । నీకునర్పించియు నినిజెప్పదనుజెప్ప జెప్పింప జెప్పనీ జెప్పనవియు । నర్పితముజేసితనని జాపాంగసాంగ । ములలను తత్త్వాంగములు దాల్పుముట్టినట్లు । దలచునర్పించు నిన్నును దన్నుస్వాను । భావసూక్ష్మప్రసాదిదా బసవలింగ. ౨౪౪

అధిపు నుద్దేశించియర్ఘ్యోదకము లిచ్చుతరి మీదుబోవునె దాహకున్న । భూతేశునకు దివ్యపుష్పముల్ బెట్టుమాత్రాన బోవునె మీదతాల్పకున్న। కర్తనుద్దేశించి గంధంబుజదవియు నప్పడుమీదబోవునే పూయకున్న । స్వామినుద్దేశించు

శాకపాకములు సవేదనవూనెయర్పించకున్న । ననచుబొందుగ శైత్యాద్యులన్ని విషయ । మిశ్రితేంద్రియములచేత మీఁదబోవ । ముట్టునేనీవు ముట్టకమును ప్రసాది । పట్టునో యిచ్చునో కొనునొ బసవలింగ. ౨౮౫

శబ్దక్రియార్పణా నక్తి సల్లింగ కర్ణముల బ్రసాదికర్ణముల జొచ్చి । రూప క్రియార్పణా రూఢిసల్లింగ నేత్రముల బ్రసాదినేత్రములుసొచ్చి । స్పర్శార్పణక్రియాభ్రాంతి సల్లింగకాయమున బ్రసాదికాయంబుసొచ్చి । రసనమర్పణ కళారమణ సల్లింగ రసజ్ఞ బ్రసాదిరసజ్ఞసొచ్చి । యానమర్పణభావమందేకదృష్టి । నిలిపి తద్విషయంబులు సలలితముగ । దెలిసివర్తించువానికి ధీనయుక్తి । కెనగుముక్తి సుఖంబులు బసవలింగ, ౨౮౬

అన్యోన్య కాయస్థమై పరకాయ ప్రవేశస్థితి నెుడళ్ల వీడువడక । ప్రాణ ప్రతిష్ఠాను బంధలీలాచార విస్ఫూర్తిబాణముల్ వీడువడక – నర్పితతనుకృతాయత సంగతి ప్రసాదవివిధోద నాదులు వీడువడక – భరితావధానానుభవనిరంతరరతి విషయేంద్రియంబులు వీడువడక – పరశివవిభూతి సుఖపరంపరవితాన – వేలసద్దాన దానముల్ వీడువడక – సమయగతలింగి లింగప్రసాదమదన – నైన గునె ప్రసాద భావనబసవలింగ. ౨౮౭

అగునిర్వ్వరకును నన్యోన్యేంద్రియంబులన్యోన్యభాజనములైయవధరింప – నగునిర్వ్వరకును నన్యోన్యప్రాయంబుల న్యోన్య హస్తంబులైయదికొనంగ – నగు నిర్వ్వరకును నన్యోన్యేంద్రియంబుల నోనన్యవక్త్రింబులై యనుభవింప – నగునిర్వ్వరకును నన్యోన్యేంద్రియంబులన్యోన్యేంద్రియంబులైయనుమతింప – నగును నిర్వ్వరకన్యోన్యేంద్రియములమిశ్ర – మములనన్యోన్య గర్భగేహములుగాగ – దివ్యలింగంబు తత్ప్రసాదియు మదించు – భావసూక్ష్మంబులెట్టివో బసవలింగ. ౨౮౮

శబ్దయోగిరము ప్రసాదిశబ్దంబుబశ్లైరము యుష్మచ్ఛ్రోత్ర పశ్లైరమును – స్పర్శయోగిరము తత్సర్వాంగగతియు పశ్లైరము ద్వితీయాంగలింగమునకు – ఘ్రాణయోగిరంబు తద్ఘ్రాణంబు దానపశ్లైరము భవత్ప్రాణలింగమునకు – రసయోగిరంబుభద్రసనాగమైన పశ్లైరమును రసనాంగలింగమునకు – రూపు గాత్రయోగిరమది రూపుమీకు – నయనలింగంబుగాగ మనంబుచేత – నర్పణముజేసియును యింద్రియములుదనకు – బశ్లైరముగాగ భోగించు బసవలింగ. ౨౮౯

గురులింగజంగమా కుంతిలోపాస్తిని బడుస్వామి భృత్యసంబంధితనువు - సహజైక లింగనిష్ఠామహిష్ఠము బాలుబడువీర భక్తి సంబంధిమనసు - విరచితాను శ్రుతచరజైక భావన సంధిల్లు శరణసంబంధిబుద్ధి - బాహ్యాంతరార్పిత గ్రాహ్య ప్రసాదసంబంధమాయింద్రియపంచకంబు - ప్రాణలింగప్రమదన సంబంధితమరు - ప్రాణలింగైక్య సుఖతమాంగాత్మ మధ్య - సర్వసంబంధిలింగ ప్రసాదియున గ - బడుసుషట్స్థలసంబంధి బసవలింగ. ౨౯౦

నీవు జూడగ జూచు నీవునూకగ నూకుజూపులు రూపులు రూపవితతి - నీవుమూర్కొన గొనునీవు నూకగనూకుఘ్రాణంబు ఘ్రాణదుర్గంధచయము - నీవు వినగను వినునీవునూకగనూకు శ్రవణముల్ శబ్దాదిశబ్దచయము - నీవానగానా ను నీవునూకగనూకురసనయు రసము నీరసమునట్ల - నీవబొందంగ బొందును నీవనూక - గరిమదకర్కొనునూకంగ కఠినములును - యిష్టలింగప్రసాదము నైరుగు వాని - కెనగు సిద్ధవిషిద్ధముల్ బసవలింగ. ౨౯౧

గంధమైనను నీవు గంధింపకున్న దుర్గంధంబుగాక సుగంధమగునె - రూపమైననునీవు రూపింపకున్నను రూపంబుగాక స్వరూపమగునె - శబ్దమైనను నీవు చనకున్న వినకున్న శబ్దంబుగాకవి శబ్దమగునె - రుచ్యమైనను నీవురుచింపకున్నను రుచ్యంబుగాక నరుచ్యమగునె - యట్లనేయుండగా నెవ్వడైననా ప్రసాదిదెలియడెమరి సుగంధాదిచయము - నేలబొంపడు సద్గంధ మెరిగినట్టి - ప్రాణ లింగాంగి జగమున బసవలింగ. ౨౯౨

కానిదుర్గంధముల్ గావనిదెలియగానంత నైబొందున నర్పితములు। కానికుశబ్దముల్ గావనిదెలియజ్ఞానంత నేబొందున నర్పితములు। గానికురూపముల్ గావని దెలియగానంత నేబొందున నర్పితములు - కానినీరసములుగావని దెలియజ్ఞానంత నే నేబొందున నర్పితములు। అయిన గంధాదులైన కాననియెఱుంగు। నంతలోన నైబొందున నర్పితములు। కావనంగకొననగును గైకొనంగ। భావనంశుద్ధిగా దెరుగా బసవలింగ. ౨౯౩

అయిన సుగంధాదు లర్పింపగాని యనర్పితదోషంబు నదిమొకండు - గైకొనరాని దుర్గంధాదులాని ననపవిత్రదోషంబు నదిమొకండు- పొందక బొందెడు పొందెరుంగక బొందునజ్ఞానదోషంబు నదియొకండు - నవుగాదనుట భ్రాంతి

యగుచు దానటుబొందు నద్వైత దోషంబు నదియెుకండు - నిన్నుబొందివర్తింప కదన్నుమరచి - మరువ కర్పితములు నిష్టమరగియున్న - నాస్వయంకృతదోషం బునవియునాల్గు - నెనగనిటు బొందవుప్రసాది బసవలింగ. ౨౯౪

భవదభిషేకాంబు పార్శ్వథారకరో సలిల తరంపరానలిలనమితి - భవదీయ పూజనావళినవపాశోధావరి ప్రనవపరంపరాప్రసనవచయము - యుష్మదర్పిత సిక్తయుక్తపార్వాంతరస్థితపరం పరాస్థితవితతి - యుష్మదీయనమర్పితోపనకాంతనదళినవరంపరాధిరాజియందు - స్వామినినుముట్టినవియ ప్రసాదమాత్ర - సాదమిశ్రితమదీయ నివేదితంబు - గానగైకొను దకుక్షముఖ్యప్రసాది - భావసూక్ష్మంబదెట్టిదో బసవలింగ. ౨౯౫

శ్రోత్రప్రసాదంబు శోత్రంబనక దకక్షన స్వేంద్రియములకనర్పితములు - నేత్రప్రసాదంబు నేత్రంబనక దకక్షన స్వేంద్రియంబుక నర్పితంబు - ఘ్రాణప్రసాదంబు ఘ్రాణంబునకుదకక్ష న స్వేంద్రియంబుక నర్పితంబు - జిహ్వప్రసాదంబు జిహ్వకుదకక్షన స్వేంద్రియంబులకు న నర్పితంబు - అట్లనీప్రసాదంబు నాప్రసాది - త్వకుక్షనకు జెందియు ననర్పితంబుగాన - చనుతదేక ప్రసాదికి ఘననియమము - భక్తివిషయేంద్రియములకు బసవలింగ. ౨౯౬

అనమర్పితమనర్పితాన్నపానాదిపంయుత భోగిఘనకిల్బిషోత్థభోగి - తావకమాత్రిన్నథ పళార్పితసు భోగియవియ మిశ్రితప్రసాదై భోగి - అర్పితాన్విత భోగియ ఖిలేంద్రియజ్ఞాననర్వస్వతంత్ర ప్రసాదభోగి - యుభయార్పిత ద్వయాభ్యుదఫలగ్రసన విసరభోగిసూక్ష్మ ప్రసాదభోగి - అర్పితా నర్పిత ప్రక్రియాక్రియాఫ - లాఫలార్పితలింగగర్భార్ధిపూర - మప్రసాదైకమూర్తి మహాప్రసాది - పరమనమ్మోదియవిషాది బసవలింగ. ౨౯౭

అంగలింగానర్పితాన్న పానాదులుముట్టిన దప్పిముట్టకైన - ఆత్మలింగసమర్పితాన్న పానాదులు ముట్టినదప్పి ముట్టకైన - మహితనల్లింగ నమర్ప్యదివ్యాదులుముట్టి సహింపకముట్టకైన - నిష్టలింగనమర్పితే తరవస్తువుల్ ముట్టినెరుంగకముట్టకైన - ముట్టకుండినజాలు జేముట్టనీవ - బెట్టగల్గుప్రసాదంబు లెట్టులైన - నవిరళేంద్రియములనునమర్పితముగ। బరువడి గ్రహింపుచుండునుబసవలింగ. ౨౯౮

నీకుశుద్ధాన్న పానీయాదు లర్పింత శుద్ధప్రసాదన:సిద్ధిగలిగి । శుద్ధప్రసాద

సంసిద్ధార్పణము జేసి తత్ప్రసిద్ధప్రసాదంబు వడసి। తత్ప్రసిద్ధప్రసాదము సమర్పణ జేసి సుప్రసాదాత్మైక సుఖము వడసి। సుప్రసాదాత్మైక సుఖసమర్పణ జేసి భరిత సుఖాతీత పదము వడసి। యా సుఖాతీత పదముల య్యర్పణములు। దన్ను నర్పించి తన్నే కానిస్సు వడసి। యాప్రసాదిమహార్పితంబౌ ప్రసాది। నెనగ నేమనివర్ణింతు బసవలింగ. ౨౫౯.

దానుముట్టక పదార్థములైన నర్పింపనవినీవ జేముట్టియవధరింపు। తనుముట్టనీకత ద్రవ్యములర్పింప నవియు ముట్టగ నేర్పు యవధరింపు। తానునీలోజొచ్చి తత్సమర్పణ నేయనతనినీలో నుంచియవధరింపు। తనలోన నినునిది తత్సమర్పణ నేయ నతనినీలో నుండి యవధరింపు। తత్ప్రసాదార్పణము జేసి తన్ను నీకు। నర్పణము నేయ నీవును నంతజొచ్చి। యాప్రసాదంబునిను తన్మహాప్రసాది। కెనగ నర్పించు దప్పక బసవలింగ. ౨౬౦

ఇతరవాహనములనెక్కక నర్పించుదావాహనంబైన తత్ప్రసాది। గమకింపమరిపాదుకములెల్ల నర్పించువాపాదుకములయిన తత్ప్రసాది। బండవిధములను గూర్చుండ నెట్లర్పించు దానిడమైయున్న తత్ప్రసాది। శయనింపగా వేరె శయనమట్లర్పించు దాశయ్యమైయున్న తత్ప్రసాది। గానయర్పింప దర్పింపక యునుదండ। నణగియుండును భావలింగార్పణంబు। కాలికి యొరిగి యర్పించు నైకొనుప్రసాది। భావసూక్ష్మంబదెట్టిదో బసవలింగ. ౨౬౧

నీకునిషిద్ధాన్న పాకాదులర్పింప నతనిని వివిధభావాబ్ధినణతు। శుద్ధాన్నములు దనప్పులిప్పి పాసార్థమై యర్పించును భయకర్మాబ్ధిత్రోవ। తాదప్రివ్యములు యుష్మదర్పొ పచారార్థమర్పింప సుకృతకర్మాబ్ధిదేల్తు - నవియుసాక్షాద్భవదభ్యవహారార్థమర్పింపనీకు గర్భాబ్ధినునుతు - నట్లగాక పిశాత నిరూపితాభిమతను - భావలులు భవదీయ సుఖార్థముగన - మర్పణము నేయతత్ప్రసాదార్పితాను - భవసుఖాంబుధినోలార్తు బసవలింగ. ౨౬౨

అగుప్రసాదంబు వస్త్రాభరణాదులు నపితాతావదినరోగాంతమనుట - అగుప్రసాదము పాదుకాసన। శయ్యల కపితాతావధి నరోగాంతమగుట - అగుప్రసాదము వాహనాందోళికాదులకపితాతా వధినరోగాంతమగుట - అగుప్రసాదమ్ము శస్త్రాస్త్రదండాదుల కపితాతావధి నరోగాంతమగుట - తద్విరోగనమర్పణాంతస్తవీయ - దర్శనస్పర్శ నాన్వితధారణాంత - సుఖపరంపరలర్పించు

సుప్రసాది - కెనగుతత్ప్రసాదసుఖంబు బసవలింగ. ౨౬౩

అర్పితాహర్ణములగు నన్నపానాదులకును శుద్ధిగావించు కొలికియెట్లు - నభిమంత్ర జలములనగు శుద్ధియందవాయా మంత్ర మేమిటనయ్యశుద్ధి - అప్రసాదము ముట్టనగు శుద్ధియందమాయును బ్రసాదముగాని ముట్టదగదు - అద్రవ్యశుద్ధి జేయగ వేరెయింద్రియంబుల బ్రసాదేంద్రియంబులును యవును - గానిభాండపాత్రస్థముల్గాకమున్న - తత్పదార్థవిశుద్ధమాదారిగోరి - యవియె దగదెచ్చియ ర్పించి యనుభవించు - భావమెరుగ బ్రసాదియా బసవలింగ. ౨౬౪

రూపార్పితవ్రితా రూఢియు బాడియు కలకాల విభునందగానబడియె - రుద్రార్పితక్రియా రూఢంబు గూఢంబు చెన్నయ్య యందముల్ జెప్పబడియె - కడికడి కర్పించు గతియును మతియును చౌడన్న యందున జూడబడియె - సహభాజనక్రియా సక్తియుభక్తియు వీరచోళుని యందు వినగబడియె - నానరేంద్రివ్రతంబు నాయయ్యజివ్వ - ఆగణాదీశు హస్తమాయవ్వమతియు - గూడనుక్కటి యైన భక్తునకుగాక - నెనగనితరుల కౌనెరుగా బసవలింగ. ౨౬౫

దానెరిగి యర్పించు ద్రవ్యరూపము భేదమెరుగ కర్పించినయెరిగెదీవు - దానెరిగియర్పించు ద్రవ్యసురుచి భేద మెరిగియర్పించిన యెరిగెదీవు - దాబాహ్యమున నర్పితము సేయు రూపంబులంత రార్పణసేయనంటెదీవు - తానంతటనమర్పితము సేయు రుచులును బాహ్యర్పణము సేయ బడెదవీవు - యందరూపనిరూపపదార్థ రుచియు - నువ్వనే కాంతరార్పణంబొల్లవీవు - గాన బరికింపతత్పమ జ్ఞానభేద - మెసగనెరుగ బ్రసాదియా బసవలింగ. ౨౬౬

నానాస్వరూప ప్రధానార్పణము దానగాన ప్రధానమంగమున కాది - యానిరూపాంగ సమర్పణమైనట్టి అంగముత ప్రధానార్పణంబు - తత్ప్రధానాంగవిధానతనంగేతర ప్రధాన విధానరహితయుగళి - యాప్రధానము ప్రాణమంగమంగము ప్రధానార్పణాంగ ప్రధానాధిరతికి - నాప్రధానరూపము లుభయార్పణంబు - లానిరూపసుఖంబులే కార్పణంబు - గానయుభయార్పణము పరిజ్ఞానమతికి - నెనగుత ప్రసాదసుఖము బసవలింగ. ౨౬౭

భవదీయఇష్టంబు భండావశిష్టంబు గుండభోగింపనే గురుడుజెప్పె - యుతవిషామృతనమస్థితి ననర్పితము మిశ్రితమును గడునమర్పితముగాదె - అన్యత్రై

వానస్యమంత్రాన్య మార్గాన్యాన్య సంకరదోషము వమముగాదె - తమలింగమున
కు మీదటమరివడ్డింప నంద్రులింగమునకే యలతివచ్చు - నంతరార్పణమే కాని
వింతలేక - నొదగుక్షీరంబులోపల మొదవుజికగ్ - నగునైనద్భాబహ్య పోషణ
మైనలింగ - బరమకృపబొందిన బ్రసాది బసవలింగ. ౨౬౮

దేవరక్షింపుచో దృష్టిగోచరములై విమలార్పణములసిద్ధములరూపు - అయ్య
వడ్డింపు చోహస్తాన్వితంబులై సిద్ధోద నాంతరసిక్త వితతి । జియ్యఅందిచ్చుచోజి
హ్వావగతములై కబళాంత రాళిసిక్తములు రుచులు । స్వామివడ్డించుచో నద్భావ
యుతములై యిరవేంద్రియ జ్ఞానమిష్టసుఖము । లర్పితములలో నీతృష్ణ తాపభ
యజ । రారుజాదిఘోరాస్త్రశస్త్రములదాల్చి । జోకజెడకనుతసర్కరలోకమెల్ల ।
వెనజయింగవ బ్రసాదియా బసవంలిగ. ౨౬౯

వీనులచేత నీవీనులచేతికి నందించు శబ్దంబులాప్రసాది । కన్నులచేతనీకన్ను
లచేతికి నందిచ్చురూపంబు లాప్రసాది । ఘ్రాణంబుచేతనీ ఘ్రాణంబుచేతికి నంది
చ్చుగంధంబులాప్రసాది । నాలుకచేత నీనాలుక చేతికినందిచ్చు రసషట్కమా
ప్రసాది । చేతచేతను దన్నునీచేతిచేత । దన్నుచేస్పర్శలందిచ్చుతత్ప్రసాది । యవధ
రించు నీవుగొనునాప్రసాద । నవ్యశేంద్రియ మ్ముల బసవలింగ. ౨౭౦

శబ్దమర్పించుచో శ్రవణంబులటుగూడజేతులై యర్పణసేయడేని । రూపుల
ర్పించు చోచూపులన్నియుగూడిచేతులయి యర్పణసేయడేని । గంధంబులర్పించు
ఘ్రాణమంతయుగూడ చేతులైయర్పణసేయడేని । రసములర్పించు చోరసయునం
తయు గూడచేతులయి యర్పణసేయడేని । బరగ లింగాంగ సంయోగభావమొప్ప ।
జెలగి విషయా దులర్పణసేయడేని । మానసేంద్రియరసములు బూనెనేని । యొన
గునె ప్రసాద సౌఖ్యంబు బసవలింగ. ౨౭౧

స్వామిత్వదీయ ప్రసాదవీనులకును వీనులు వీనులై వినికి యొసగు । సదయా
త్మయుష్మత్ప్రసాదిగన్నులకు నీకన్నులు కన్నులై కాన్పులొసగు । శరణవత్సల
నీప్రసాది రసనకు మరి రసనకు రసనయై రసములొసగు । కర్తనీదు ప్రసాది ఘ్రా
ణంబునకును నీఘ్రాణంబు ఘ్రాణమై గంధమొసగు । స్పర్శనములట్ల మరియునర్ప
ణము జేసి । బొందుమీరగ సచ్చిదానందరూప । మందునెలకొని పాదారవిందవిను
తు । డసదృశేంద్రియవ్యాప్తియా బసవలింగ. ౨౭౨

ఆన్యలింగప్రసాదాను భూతంబుతత్సంపుష్టరూపప్రసాదిజూడిక । అన్యలింగప్రసాదానుభూతంబు తత్సంపుష్టగంధప్రసాదిఘ్రాణ । మన్యలింగప్రసాదానుభూతంబుతత్సంపుష్ట శబ్దప్రసాదివినికి । అన్యలింగ ప్రసాదానుభావంబు తత్సంపుష్ట భావప్రసాదిమనసు । స్పర్శలునురసములు దక్క దర్శనాదు । లవినిరూపంబులభ్యంతరార్పణములు । జ్ఞానతత్త్వసమర్పితాదాన భేవ । మెసగనెరుగ ప్రసాదియా బసవలింగ. ౨౬౩

అంగీకృతప్రాణలింగాంగకర చరణాది నిరూపిత భేదమెరిగి। సాంగ వల్లింగ నానాంగ సమన్విత ప్రీతి లింగోదక భేదమెరిగి । శీతలోదక సముచితపునఃపునరర్పితాది ప్రసాద విభేదమెరిగి । ఆత్మసంభవ మగ్నహర్షాపహార్హ జల సమర్పణ సంవిసర్జనముల । భేదమెరిగి తత్ప్రసాదోదకముల । ధర్మమర్మంబులెల్లను దగనెరింగి । కర్మసముదాయమును దానుగడకు ద్రోసి । వెనజరింప ప్రసాదియా బసవలింగ. ౨౬౪

అర్ఘ్యోదకంబును నర్పితోదకమునునన్యోన్య క్రియలకునర్పితంబు - మహనీయస్నానసమ్మార్జ్జనోదకములు నన్యోన్యక్రియలకు నర్పితములు - హస్తోదకాంఘ్రి సమర్పితోదకములు నన్యోన్యక్రియలకు నర్పితములు - గంధూషపానీయ కలితోదకంబులు నన్యోన్యక్రియలకు నర్పితములు - సవిప్రసాదంబులోయర్పణావధాన- మహామెట్లన్న నాభరణాదులట్ల- జ్ఞానయర్పణములచేత గ్రహణభేద - మెసగనెరుగ ప్రసాదియా బసవలింగ. ౨౬౫

సద్గురులింగ ప్రసాదేష్ట లింగప్రసాదసంసేవనాశ్రాంతరతులు - జంగమలింగ ప్రసాదేష్ట లింగప్రసాద సంసేవనాశ్రాంతరతులు - త్రివిధప్రసాదస్వాదైకవిశ్వాస సుఖాన్వితకలిత విశ్రాంతరతులు - సకలాభ్యలింగ ప్రసాదసేవనములు గలుగునె పెక్కు లింగంబులనిన - లింగడొక్కండుగాడె భక్తాంగకోట్ల - దోచునెట్లన్న నొక్కచంద్రుండుగాడె - అంబుకుంభంబులను దోచునట్లుగాన - నెనగు బహులింగ రూపముల్ బసవలింగ. ౨౬౬

షట్త్రింశతత్వమై సకల నిష్కళదేహమది ప్రసిద్ధంబుగుర్వంగమగుచు - నాసద్గురుపు నిష్కళాంగంబు జాలింగమది శుద్ధమగుసకలాంగమగుచు - నాసద్గురునినిష్కళాశీతసుకరంపు మదియు మహాప్రసాదాంగమగుచు- నాసద్గురుని ప్రసా

ద్వైక్య సంసేవనా భావంబుమిగుల సద్భావమగుచు - నాదిగౌరవాచారలింగాను భూతి- నలరుచునట్టి సత్ప్రసాదానుకళల- నతిశయంబయివెలుగు మహాప్రసాది - పరశివుం డనదగునయ్య బసవలింగ. ౨౨౭

ముట్టకముట్టించు ముట్టియర్పించు నద్యతన కాలోచిత ద్రవ్యవితతి - ముట్టియర్పించుచు మునుముట్టకర్పించి సంతసంబందు ప్రసాదచయము - ముట్టించిముట్టుదోర్ముఖమున యదియును ముట్టినమర్పించి ముట్టబుట్టు - ముట్టనింద్రియములముట్టకర్పించు నెట్లన్నతత్తత్సుఖానందమగుచు - కాంతకాంతుని బుద్రునిగౌగలించు - విధముదోచెను భావంబువేరెయైన - నట్లముట్టియు ముట్ట డుద్యత్ప్రసాది - భావశుద్ధి దానెట్టిదో బసవలింగ. ౨౨౮

అన్యతృణోదకా ద్యనమర్పిత సమేయకాయంబు లింగోదకములగడగు - ద్రవ్యమిశ్రితసికతాద్యనమర్పిత గతజిహ్వాలింగోదకములగడగు - చిత్తముఖ్యానర్పితాంతనిత్యాకీర్ణ కర్ణముల్ లింగోదకములగడగు - అణురేణుధూమ్రముఖ్యానమర్పిత యుతాక్షరములు లింగోదకములగడగు - ఘ్రాణమనునట్లయాకస్మికంబునందు - గడునమర్పితాదివంకంబు గడుగు - నాప్రసాదిలింగస్పర్శయను జలముల - మనలక ప్రమోదవశుడౌచు బసవలింగ. ౨౨౯

యర్పితరూపసమాప్తియా నంతకుభురిభోక్త వీవయైయవధరింప- తద్ద్రవ్యరసనమాప్తంబగు నంతకు ననుభోక్త నీవయైయవధరింప - తద్రుచులును నమాప్తంబగు నంతకు నను భోక్త వీవయైయవధరింప - తత్సుఖంబులు నమాప్తంబగు నంతకునను భోక్త వీవయై యవధరింప - నాప్రసాదికి జిహ్వదులనానసీక - వరినమాప్తంబుగాగ నర్పణము సేయ- సునికికినిమెచ్చి మరికథోక్తిని ప్రసాద- మెసగనీలోన నుంచుము బసవలింగ. ౨౩౦

ఆత్మలింగానర్పితై కాక్షరోచ్చార మదియునతఁబులనుదురుగాన - ప్రాణలింగానర్పితాణు మాత్రస్పర్శయది జరారుజాలకుకుదురుగాన - సంగలింగానర్పితాంఘ్రిక విన్యాసమది పునరావృత్తికుదురు గాన - నిష్టలింగానర్పితేచ్ఛాప్రవర్తన మదిసత్ప్రవర్తన కుదురుగాన - చనుతదీయాన్యతానుసజ్జననకర్మ - ములకునర్పితద్రవ్యాను భోగవతుడ - కానసర్వార్పిత ప్రసాదానుభోగి - ప్రాప్తదైతదా వదలకును బసవలింగ. ౨౩౧

ఖానంగ వలవదే భాండాదిసంగతి కటము న్నెపూర్వ ద్రవ్యాశ్రయంబు - లర్పింపవలవదే యవికళేంద్రియమ్ముల నానకము న్నె పదార్థచయము - భోగింత వలవదే బొందంగబడు షడ్రసములకు మున్నె ప్రసాదసుఖము - తనియంగవ లవదేదనుమనఃప్రాణ సంతృప్తికి మున్నె తదీయభుక్తి - గరికొనఁగ వలవదె మ రువకమున్నె మ - హాప్రసాదసత్సుఖాబ్ధిలోన - నట్లగూడదేహమా ప్రసాదాను సం - వృత్తిగూడవలదె బసవలింగ. ౨౮౨

అవికళేంద్రియ భుక్తులర్పితంబయ్యెబో తను గుణావళులర్పితముగవలదె - తనుగుణావళులర్పితంబయ్యె బోనిజాంతః కరణం బర్పితముగవలదె- తనివిదీరంగ నంతఃకరణం బర్పితంబయ్యె బోప్రసాదరసనగర్భ - నిర్భయార్భక సదాంతర్భ రితంబు మహాప్రసాదంబుదానర్పితాను - భవముబొందెడి వారికి భక్తుడగుచు - త్రివిధలింగైక్య జ్ఞానంబుదెలసియాత్మ - నిర్వికల్పసమాధిని నెగడుచున్న - వాడె ప్రసాదియగు భువి బసవలింగ. ౨౮౩

చనువుమీరగ ననుదినవర్ధమాన గతాస్థినఖర చికురార్పణముగ - చ ర్మకీలాలమాన స్థూలసూక్ష్మాంగదశాంగగణశోషణార్పణముగ - సమధాతు జనిత విషమధాతుజనిత నిజారోగ్య రోగసమర్పణముగ కాలానుగతసహాగమన సంయోగమనాగ మనము వివిధార్పణముగ - నఖిలధనధాన్యవస్త్రవిద్యావి భూష- ణాదిసంపదసేవలునవ్యయములు - నర్పితముజేసి వర్తించునాప్రసాది- బరగు సర్వప్రసాదినా బసవలింగ. ౨౮౪

భవికూపమాది ప్రవాహతటాకాదిభస్త్రి కమండలు భాండవారి - భవిజ నారంభసంభవ ధాన్య నికరతదారామకుల్యాల తాంతరాది - భవిజనస్పర్శ న పల్లవకందము లౌషధప్రముఖ పదార్థసమితి - భవిదృష్టి పతనాంనపానాది బహుపాకతైలప్రభృతిరస ద్రవ్యచయము - భవికృతాంబరాదులు భాండభాజ - నాదులగు నిషిద్ధవస్తుచయముల భవితత్వ - మర్పణార్హములు తదీయప్రసా ది - కెనసునె ప్రసాదసౌఖ్యంబు బసవలింగ. ౨౮౫

లోకనిషిద్ధాన్న పాకాదులెల్లనంస్కార కృతాన్నపాకములు సమము। కానసంస్కార కృతానర్హములు వానిపూర్వాశ్రయం బెట్లుబుచ్చవచ్చు। సం స్కార కృతపాకకాన్నాదులును సంస్కారితదర్శన స్పర్శనాది। దర్శనస్ప

ర్శనాత్మకమైన విషయాదుల వియెల్ల నిరసనసమరసల్పి । భవివితాన క్రియాశుద్ధి బరగజేసి । భవివిసర్జనమైనట్టి భక్తుడెవుడు । సిద్ధలింగ సూక్ష్మాచార శుద్ధివలన । భావశుద్ధి నియతిసిద్ధ బసవలింగ. ౨౮౬

సమధి గతానర్ఘ్య సద్గురుజాత పవిత్రేష్ట లింగసుక్షేత్రవంచ । కేదారవిధియు సప్రసాదిబరీక్షించి గరమొప్పనంతట కర్షకుండు । వర్తించురీతిని వలనువ్వ కేదారమందున ఫలితంబు బొందువడగ । ఫలములు యుష్మదర్పణ మాచరింపుచు ప్రతిముహూర్తము క్రొత్తపంటలైన । తత్స్వయంకృషి ప్రోక్తతత్ప్రసాద - ఫలనిరంతర భోగసంప్రాప్తి నటకు । 'సస్యకృషిఫలాదులు మట్టడాప్రసాది । వెనగళా ప్రౌఢియెట్టిదో బసవలింగ. ౨౮౭

చరియించు తద్వ్రతాచార ప్రవర్తనలర్పించు నీమనంబందియుండి । ముట్టినానాకంద మూలాన్న పానాదులర్పించు నీకరంబందయణగి । పొందునానా వస్త్ర భూషణమాల్యాదు లర్పించు నీయాత్మయందయణగి । పాయునానాకర్మభాష్పకణాదులు నర్పించుబుద్ధినీయందనిలిపి । యట్లస్వహ్నావగత భవదాప్రసన్న । సుఖములర్పించుచును హుతముఖుని జేసి । యాప్రసాదియు తత్ప్రసాదాంచితాను । భవసుఖంబందు నీయందు బసవలింగ. ౨౮౮

విహితావిహితము లావిధినిషేధక్రియలవి రెండునీకు సమర్పణముగ । నందు సముద్భవంబగు పుణ్యపాపంబులవి రెండునీకు సమర్పణముగ । నందునంభూతంబులగు శుభాశుభచేష్టలవి రెండునీకు సమర్పణముగ । నందునంజనితంబులగుసుఖదుఃఖంబులవి రెండు నీకుసమర్పణముగ । తత్పరంపర రాజకృత్యములమీరు । భక్తిముక్తులు రెండు సమర్పణముగ । జనతదీయఫలానపేక్షప్రసాది । కెనగుసిద్ధ ప్రసావంబు బసవలింగ. ౨౮౯

హానివృద్ధులును జయాపజయంబులు నాదియాక్రియలు నీకర్పణముగ । మానానావదసంపదల్ హర్షాదులిటుల లోపాలోపములును నీకర్పణముగ । మానావమానముల్ హీనాధికంబులు నవియెల్లనీకు సమర్పణముగ । నిందాస్తుతులు కర్మనిష్కర్మములును కార్యాకార్యములును సమర్పణముగ । కామనాకామములును రాగములు ద్వేష । ములును క్రియలెల్లతత్ప్రముఖ్యదశలు । సర్పణముగాగ మున్నన్నయాప్రసాది । కెసగునే భవభంధముల్ బసవలింగ. ౨౯౦

ఘనతరంబైనట్టి గంధవస్త్రాభరణాదులు నీకుసమర్పణముగ । చూపులురూపులు శ్రుతులును మఱియు ఛాయని రీతినీకుసమర్పణముగ । వాసనలును శ్వాసవర్గంబులును ధర్మాధర్మములును నీకర్పణముగ । రసములు రసనాగ్రరసములు పాటలు నాటలు చదువులు సర్పణముగ । వీనులాలించుటలు గూడవివిధవిషయ । సుఖములర్పించిగైకొను సుప్రసాదిపంచభూతాదికృత్యముల్ బహువిధముల। పరిణమించంగ దానేర్పు బసవలింగ. ౯౧

తలపనర్పితవిధి దారునేభవదంఘ్రి శతపత్ర కీర్తన కౌశలలవలన । పలుకు నర్పితవిధి జిలుకునేభవ దఖిదాధానామృతరసపాత్రంబువలన। భావంబునర్పితపద్ధతిబొలయు తద్భాగ్రశీమదనోత్సవమున మునిగి । ప్రాణంబునర్పిత పథనాదిజను నె తత్ప్రాణలింగైక్య సంపదలబొదల । దన్నుచూపునె యనమర్పితములరొదలు । దానశాగత ప్రాణమధ్యముననణగి । యింద్రియంబుల కర్పింప నిచ్చనేయ। బడునె తత్ప్రసాదియు బసవలింగ. ౯౨

మదనవికారంబు మదిబుద్ధిపశ్పటి తలపులర్పించెడి కొలదిమెరిగి । రమణిని నావేళ రతిబుట్టినాడెదు మాటలనేర్పరి వాటమెరిగి । అంగనంగతి చుంబనాలింగనాదుల తీపు లర్పించెడి తెలివియెరిగి । దమకించు పొందుచే దన్నెరుంగనియట్టిసుఖము లర్పించెడి సూక్ష్మమెరిగి। బరగనంతరంగ బహిరంగములయాత్మ।విషయగతుల సహితవివరమెరిగి । యర్పణంబునేయ నతడు ప్రసాదాంఘ్రి । పటుదయాంతరంగ బసవలింగ. ౯౩

శాఖమిశ్రమము విస్తారంబు నర్పించు పాకమిశ్రక్రియా పరికృతియట్ల । పాకమిశ్రము పొందువరగ నర్పించుచో రసమిశ్ర మర్పించురమణయెట్లు । రసమిశ్రమ పథానురతిరస ముట్టించుచుచి మిశ్రమైనట్లు రూపమెట్లు । రుచిమిశ్రమాత్మను రూపమర్పించుచో వివిధమిశ్రార్పణ విహితమెట్లు । విషయమిశ్రమాత్మ విభుజాచ్చియిచ్చుచో । తత్ప్రసాదమను విధానమమర । వెలయమిశ్రమైనవివిధాన్నరసములు। పరిగ్రహించుటెట్లుబసవలింగ. ౯౪

రాదుపూర్వంబన్న రాదుపూర్వమువచ్చు నగుద్రవ్య తత్పూర్వమణగుటెట్లు । ముట్టిము నిడరాదుముట్టక నీరాదు ముట్టక ముట్టించు ముట్టరెట్లు। రుచులెరుగశరాదు రుచులెరుంగుటయుగాదు రుచులర్పణము నేయ రూపమెట్లు । సోకరా

దర్పించి నూకరాదొల్లక గంధదుర్గంధసంబంధమెట్లు । యిచ్చిగొనగరాని యీ రానివాహనా। నసవిధార్పణములచందమెట్లు । మిగులబొందగలుగు దగవస్త్ర భూషణ । భావమెట్లుగలుగు బసవలింగ. ౫౫

త్రాసునందున మరి బేసిలేకను యొక్కచందమై తూకంబుబొందినట్లు । యుక్తంబుగామంచి నొకదిక్కు వేయంగనున్న దిక్కున నేత యొనరునట్లు । నరి ధనుర్ధారుడు లక్ష్యంబేయ బాణంబు దొడ్డొన రేంధ్రుండుదోచునట్లు । బిలుచుచు నిద్రించ బేరొక్కన్న వైనయక్షరముల తోన మేల్కొంచినట్లు । నసమశబ్దాదివిష యానుభానుభూతి । శ్రోత్రిముఖ్యేంద్రియంబులు సోకునపుడు । నతిశయంబుగత త్ప్రసాదానుభవము। భవ్యమగురీతి దానెట్లు బసవలింగ. ౫౬

జగమున గొందరు శైవులమంచును బల్కుచుందురు మరిపాటిగాను । వివ రంబుగా సప్తవిధశైవ భేదంబు లెరుగనేరరుగురుతరముగాను। వృత్తిశైవంబగుబ త్తివైష్ణవ మగుత్రి కరణశుద్ధి లేదెంచిచూడ । గీర్తింపగా శివగీతలు జదువరుదగ భగవద్గీతలగణితంబ । టంచుబల్కుచునుందురు పంచముఖుడు । ఘనముమీరిన భగవంతుడనెడుబుద్ధి । దోచదేమందు వైష్ణవతుల్యులవని । పనశివప్రసాదు లెట్లు కో బసవలింగ. ౫౭

ఆకసమున గడుజోకను జనుదెంచు వైనతేయునిజూచి మానుగాను । ద్వా రకాపురి వాసకారుణ్య సాగర ధీయుతపోష కృష్ణాయటంచు। బొగడుదరరిము రి జగదోపకారియా వృషభేశుస్మరణ గావించరెవుడు । మోదంబుమీదప్రహ్లాద విభీషణాయనుచు స్మరించెదెరనుదినంబు । నీదుభక్తుల జూపరునీస్వరూప । మిట్టిదన్నను మరిజెవిబెట్టరహహ । యట్టివారిని భువిశైవులనుట దెట్లు । వసుధ వారప్రసాదులా బసవలింగ. ౫౮

దహనకార్యము ధరధర్మంబటందురు ఖననంబుధర్మంబుగాదటంద్రు। యేభూతమాదియా నీభూమిస్థూల శరీరాదులకును మాతృకయనెద్ది । యట్టిభూతం బునగుట్టుగా డాగుటకన్న నుదహనంబు మిన్నయగునె । శంకరుండన నొప్ప షణ్మతోద్ధారకుండును సమాధియుధర్మమనెనుగాదె । బూనియెన్నడుమరి ము ట్టరానివారు । డాకిగాల్చుట శల్యముల్ దాచినీట। గలపువారలు మేముశైవు లమటంచు । బల్కువారు ప్రసాదులా బసవలింగ. ౫౯

భవదక్షుణాచలప్రవర్తితనియమ ఘృణాపరిపాకకేళి విహారణములు । భవదివ్య గురుపాదపద్మరజస్స మోద్భూతాను భావవిఖ్యాతినుతులు । భవదంఘ్రిసరసిజ ప్రస్తుతపాంసునమున్నతసీమానుమోదయుతులు । భవదను భూతవిస్ఫార సుఖామృతరుచిర సర్వేంద్రియారూఢ మతులు । జేయనీస్తవంబు జెవులారవినువారి । వ్రాయువారిజదువు వారివిస్త । రించువారి నతినమంచితముగ బ్రోవు । పటుదయాంతరంగ బసవలింగ. 300

ఇది శ్రీమద్బసవేశ్వర ప్రసాద లబ్ధకవితా ధురీణ భృంగిరిటగోత్ర
శ్రీమత్పాల్కురికి సోమనాథ ప్రణీతంబగు చతుర్వేదసారము



శ్రీః.

# అముద్రితగ్రంథప్రకటన.

వైదికోత్తములారా!

## శైవశ్రౌతకళానిధి.

వినుండు. శ్రీమదుత్తరవాతూలాంతర్గతంబగు శైవశ్రౌతకళానిధి యనుమహా గ్రంథంబొకటి బహుప్రయత్నములచే సంపాదించినాడ. యచ్చొత్తించుటకు రు 1000 గావలసినట్లున్నది. గాన సద్గుణాకరులు వారివారికిదోచినంత ద్రవ్యసహాయంబుగావించి నాపూనిక నెరవేర్ప ప్రార్థించెద. నిందుమూడుఖండములుకలవు.

---

అందుగలవి విషయంబు లేమనగాగౌరీదేవి యధ్వరంబులు సల్పువారికి ఫలంబేమని శంకరునిగూర్చి ప్రశ్నజేయుటయు పశుబంధంబొనర్చినవనంబుసల్పువారికి స్వర్గభోగమేగాని సాలోక్యాది పదవులులేవని శంభుండు వచించుటయు దత్కారణంబేమని ఉమాదేవిమనవిజేయుటయు పిష్టపశువుచే రుద్రయాగంబు సల్పువారికి చతుర్విధ పదవులుగలవని పశుపతి వక్కాణించుటయు తత్క్రమంబుదెల్పుమని దేవి ప్రార్థించుటయు నంతట పిష్టపశుక్రమంబును యాగమంటపాదుల లక్షణంబును శతక్రతువుల వివరంబును మహేశ్వరుండు మాదేవికి విశదపరచుటయు నిన్నివిషయంబులచే ముప్పదియారుపటలంబులై ప్రథమ ఖండంబు వెలయు.

---

యజమాన-దీక్షిత - శ్రోత్రియ - ఉద్గాత-హోత - అధ్వర్య - ప్రస్తోత మైత్రావరుణ- ప్రతిహర్త-అగ్నీధ్ర-సుబ్రహ్మణ్యాది- క్రతుసాధకుల- లక్షణంబులును యనేకానువాకంబులు గలసిద్వితీయ ఖండంబు విస్తరిల్లు.

---

శతక్రతుఫలితానుక్రమణికయు రుద్రయాగఫలలక్షణము శైవదీక్షబొందక యజ్ఞము జేయువారికిగలుగు దోషవివరము సప్తవిధశైవదీక్షాలక్షణంబును మొద

లగు ధర్మంబులచే నిరువదియైదుపటలంబులుగల తృతీయఖండంబువిలసిల్లు.

---

## వీరశైవసారసంగ్రహము.

శ్రీమన్నిగమాగమపురాణేతిహాసాంతర్గత ధర్మంబులుగూర్చి యొనర్పంబడిన వీరశైవసారసంగ్రహంబను గ్రంథంబుముద్రింపించప్రయత్నించుచున్నవాడ. తద్గ్రంథంబునగలవివరంబు.

---

యెవ్వారు జననకాలమాదిగా లింగాంగులో యెవ్వారికులమంతయు భిన్నభావము లేకయుండునో యెవ్వారి సంతతికెల్లను లింగధారణలేకున్ననిందగలుగునో యెవ్వారుగోత్రప్రవరాదులెరిగి షోడశకర్మలు గావించుకుందురో యెవ్వారువేధామంత్ర క్రియాసహితమైన యేకవింశతి దీక్షాక్రమంబులుదెలియుదురో యెవ్వారేకోత్తర శతస్థలవిచారపరులై చతుష్షష్టిశీలంబులెరింగియష్టావరణసిద్ధిగలిగి పంచాచార పరులగుదురో వారేవీరశైవులని దెల్పగలయనేక ప్రమాణంబులుగలిగి పంచవింశతి ప్రకరణంబులంబరగు.

---

## దేవబ్రాహ్మణవిమర్శనము.

దేవబ్రాహ్మణవిమర్శనమను గ్రంథంబనేకగ్రంథప్రమాణంబులుసంగ్రహించివ్రాసినాడ. దేవునకు బ్రాహ్మణునకు గలయభేదప్రతిపత్తియు దేవశబ్దము భగవంతునకు బ్రాహ్మణశబ్దము విప్రునకీరెండుశబ్దములువీరిరువురికేదప్ప తక్కినవారలకు తచ్ఛబ్దంబులు ఘంటాపథంబుగా జెల్లవనియు వీరిరువుల ధర్మంబులపరిమితముగా దెలుపగలిగి పదునైదు ప్రకరణంబులైదనరు.

ఇట్లువిన్నవించు,

గంగపట్టణపు సుబ్రహ్మణ్యదేవర

---

# ప్రకటన

శ్రీః

మారీస్ఫోటకమహామారీనివారిణీ.

సజ్జనులారా!

యీగ్రంథంబు మాలినీశాస్త్రాంతర్గతంబగుగొన్ని మంత్రం సంగ్రహించి ప్రకటించుటకు ప్రయత్నించినాడ - కలరాయనునా తరముగలమారికిని - మసూచియును - స్ఫోటకమనకును - ప్లేగను మాంతకంబుచేజెలంగుమహామారికినుపసంహారరూపమైన మంత్ర తదుపాసనలక్షణంబులు - తదంతర్భూతతంత్రవివరంబులు - యదృష్టాంతంబులగు పురాణోదాహరణంబు గలిగి - తదుపద్ర లు నివారించుమార్గంబులు జక్కగాదెలుపగల యీగ్రంథంబు కాలంబున నచ్చొత్తించుటకు ద్రవ్యసహాయ్యంబుగావించుదురనియు చదువరులీగ్రంథంబు బరిశీలించి తద్విషయంబులును మిత్రబృందం కానందంబు గలుగునటుల బోధించి లోకోపకారంబునకు నావలె శ్రద్ధాభక్తులచే పాటుపడుదురనియు మీయశములను గూర్చి మిక్కి ప్రార్థింపుచున్నవాడ.

ఇట్లువిన్నవించు,

గంగపట్టణపు సుబ్రహ్మణ్య దేవర